# గంగాలహరి



కృతికర్త:

మోచర్ల రామకృష్ణయ్య

# తొలిపలుకు

జగన్నాథ పండితరాజు సంస్కృత భాషయందు రచిం "గంగా లహరి" యను చిన్న స్తోత్రకావ్యమున కీ గ్రంథ ంధ్రానువాదము; కావున, దీనికిని "గంగా లహరి" యనియే పేరు. దీనిని నెల్లూరు వాస్తవ్యులు మ. రా. రా. శ్రీ. మోచర్ల రామకృష్ణయ్యగారు రచించిరి. ఈ రామ కృష్ణయ్యగారు నాకుఁ బూర్వపరిచితులై యున్నవారు కారు. వీరి యన్వయ గోత్రాదు లైనను నే నెంతమాత్రము నెఱిఁగిన వాఁడను గాను. అట్లయినను వీ రీనడుమ నన్నీ గ్రంథమునకుఁ దొలిపలుకు వ్రాయఁగోరుచు నా పేర నొక జాబు వ్రాయు టచే, నే నీ నాల్గు మాటలను మాత్రము వ్రాయుచున్నాను.

పండిత రాయలవారు (జగన్నాథ పండితుఁడు) సుప్ర సిద్ధ సంస్కృత మహాకవి. ఆయన రచించిన భామినీవిలాసాది సంస్కృత గ్రంథములు, లోకోత్తర కవితారచనా విశేషమున విరాజిల్లుచున్నవి. అందును, గంగా లహరీ కవితారచన కేవ లము భక్తిరస ప్రధానమై, యత్యంత మనోహరమై, యమృత ఝహరి వలె నలరారుచుండును. ఆ కారణముననే కాఁబోలు, ఇది పెక్కండ్రు తెలుఁగు కవుల హృదయముల నాకర్షించినది.

దీని నీ రామకృష్ణయ్యగారే కాక, మఱి కొందఱుకూడఁ దెలిఁగించి యున్నట్లు వినియున్నాను. వారిలో రాజమహేంద్రవర కళాశాలయందుఁ జిరకాలము సంస్కృతాంధ్ర పండితపదవి నలంకరించి కీర్తిశేషులైన బ్రహ్మశ్రీ ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులవారు తెలిఁగించిన గంగా లహరిని నేను జూచియుంటిని. శ్రీ వ్యాసమూర్తి శాస్త్రులవారు గంగా లహరినే కాక, పండిత రాయకృత భామినీవిలాసాదులను గూడ నాంధ్రీకరించి యుండిరి. మఱియును, అల్లమరాజు రంగశాయి కవిగారొకరు ఈ గంగా లహరిని దెలిఁగించి యున్నారఁట. ఇట్లే మఱి కొందఱు కవు లీగ్రంథమునందలి సౌందర్యాతిశయమునఁ బ్రేరితులై, దీని నాంధ్రీకరించి యుండవచ్చును.

ప్రస్తుతము నా యపరిచిత మిత్త్రులు మోచర్ల రామకృష్ణయ్యగారు రచించిన యీ యాంధ్ర గంగా లహరి ధారాళమైన కవితారచన గలిగి, మృదు మధురముగా నొప్పుచున్నది. సాధారణముగా, భాషాంతరీకరణము మూలానుసారముగా నుండి, రక్తి కట్టుట కష్టము. ఎంత నేర్చినవారు కూర్చిన, నది స్వతంత్ర రచనవలె సరళముగాను సహజముగాను గానిపింపదు. కాని, మన రామకృష్ణయ్యగా రీ గంగా లహరి ననువదించునపుడు మిగుల జాగరూకత తోడనే మెలఁగి యుండి రని నా యభిప్రాయము. సాధ్య మైనంతవఱకు వ్యర్థపదములు గాని,

క్లిష్టాన్వయములుగాని రాకుండఁ బద్యము లన్నియుఁ బొంది కగా రచియించిరి. ముక్కకు ముక్క నొక్కిపట్టించి యక్క ఱకు మాలిన తెలుఁగున నాంధ్రీకరింప లేదు. పద్యరచనకై యాయన శ్రమపడినట్లుగాని, యర్థావగతికై పాఠకులకు శ్రమము గల్పించి నట్లుగాని కనుపట్టుట లేదు. మృదుళము లును సరళములు నగు సంస్కృత పదములును జిలుఁగుఁ దెలుఁగు పలుకులును గలియఁగూర్చి, నలుగురకును నచ్చునట్లు తెలుఁగు చేసిరి కాని, తల తిక్క దారులు ద్రొక్కియుండ లేదు.

ఈ గ్రంథమును బట్టి చూడఁగా, గ్రంథకర్త రామ కృష్ణయ్యగారు సంస్కృతాంధ్రములయందుఁ జక్కని పరి శ్రమ మొనరించి, యుభయభాషా సంప్రదాయములను దెలిసి కొని, సలక్షణముగాఁ గవిత్వము చెప్పఁ గడంగినవారు గానే తోఁచుచుండిరి గాని, కేవల మాంగ్లభాషయందే పట్టభద్రులు మాత్రమైనట్లు కనుపట్టుట లేదు. వారి సామర్థ్యాదులను గుఱించి నే నింతకంటె నేమియు నెఱుంగనివాఁడను గావున, విశేషించి వివరింపఁ జాలనందులకు వారును, వారిని బాగుగ నెఱిఁగి యున్నవారును నన్ను మన్నింతురు గాక.

అపరిచితుఁడ నైన నా చేత గ్రంథకర్తగారు తమ పుస్తకమున కిట్లు తొలిపలుకు వ్రాయించుకొనఁ దలచినఁ దలఁపవచ్చునుగాని, గ్రంథకర్త సంగతి సందర్భముల నెంత

మాత్రము నెఱుంగకయే నే నీ గ్రంథమునకుఁ దొలిపలుకు వ్రాయఁ బూనుకొనుట సాహస మేమో !

ఆంధ్రభాషాభిలాషు లీ గ్రంథము నామూలాగ్రముగఁ బఠించి, యిందలి కవితాసారస్యాదులను జవిచూచి యానందించి, యేతత్కృతికర్తను గృతకృత్యుని గావింతురుగాక యని కోరుచున్నాను. తాను జిన్నతనమునం దుండియు, నాంగ్ల భాషాభ్యాస మొనర్చి, పట్టమును బడసి న్యాయవాదివృత్తి యం దుండియుఁ, దగిన యవకాశము గలిగించుకొని మాతృభాషాభిమానముచే నిక్కాలమున నిట్లు సలక్షణముగాఁ గవితాపరిశ్రమము చేయుచున్న గ్రంథకర్త నే మని యభినందింపను !

ప్రస్తుతము
"గులాబి"
అడయారు
మద్రాసు
22-11-1937

ఓలేటి వేంకటరామ శాస్త్రి
"కవితా విలాసము"
పిఠాపురము

# పండితరాయని వృత్తాంతము.*

—:o:—

పండితరాజ బిరుదాంకితుఁడు జగన్నాథమహాకవి తెలుఁగువాఁడు. వేఁగినాఁటివాఁడు. ఇతని తండ్రిపేరు పేరుభట్టు. పేరమభట్టు అనియు నామాంతర మున్నట్టు యీ కవికృత ప్రాణాభరణ మను కృతియం దున్నది. ఈ కవి తల్లి లక్ష్మీదేవి. ఈయన జననకాలము స్పష్టముగాఁ దెలియదు. కాని, యీతఁడు డిల్లీపాదుషా లగు షాహేజహాను—ఔరంగజేబుల కాలపువాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు.

జగన్నాథుని తండ్రి పేరుభట్టు కాశిలో జ్ఞానేంద్రభిక్షువుకడ వేదాంతశాస్త్రమును, మహేంద్రపండితుని సాన్నిధ్యమున న్యాయ వైశేషిక దర్శనములను, ఖండదేవుని యంతికమునఁ బూర్వమీమాంసయు, శేషోపాధ్యా వీరేశ్వర పండితుని ప్రోల మహాభాష్యమును నేర్చెను. జగన్నాథుఁడు శాస్త్రవిద్యాభ్యాసమును నాయనగారి చెంతనే జరిపి, యావనవంతుఁడై మహదాశ్రయ మభిలషించి, డిల్లీనగరముం జేరి, యింద్రవైభవ సంపన్నుఁ డగు షాహేజహాను చక్రవర్తి యాస్థానముం బ్రవేశించి, యా సమ్రాట్టును స్వీయ విద్యా చమత్కారాతిశయమున సంతసింపం జేసి, యాతనివలన

---

* ఈ యుదంతము నిర్ణయసాగర ప్రకటిత రసగంగాధర పూర్వపీఠికనుండి గ్రహించితిని. తత్పీఠికా కర్తకు మత్కృతజ్ఞతాపూర్వక వందనములు.

పండితరాజ బిరుదముం బొందెను. షాహేజహాను చక్రవర్తి క్రీ. శ. 1628 సంవత్సరమున సింహాసనాధిరూఢుఁడై, క్రీ. శ. 1658 లోఁ దన కుమారుఁ డగు నౌరంగజేబువలన నిర్బంధావాసము ననుభవించి, క్రీ. శ. 1666 లో మరణించెను. షాహేజహాను చక్రవర్తి పెద్దకుమారుఁడు దారా ఔరంగజేబుచేఁ దత్పూర్వమే కడతేర్పంబడెను. షాహేజహాను చక్రవర్తియు, యువరాజు దారాయును బరలోకగతు లైన పిదప నిరాశ్రయుఁ డైన పండితరాజు, ఢిల్లీ వదలి కాశియో మధురాపురమో చేరి, పరమేశ్వరారాధనముం గావించుకొనుచు జీవయాత్రా శేషము గడపెను.

ఈ మహాకవిం గూర్చిన యాభాణకము లనేకము లున్నవి. ఇతఁడు * జయపురాధీశుని యాహ్వానము నంగీకరించి

---

* ఈ జయపుర మేదియో నిర్ణయింప వలసపడ కున్నది. ఒక జయపురమున మహారాష్ట్రి దేశస్థుఁ డొకఁడు గ్రీకుభాషలో విరచింపఁబడిన రేఖాగణితమును (Euclid) సంస్కృతభాషలోనికిం బరివర్తించి ప్రసిద్ధుఁ డయ్యెను. ఆతని పేరును జగన్నాథుఁడే; కాని, యాతఁడు పండితరాయఁడు కాఁడు. ఇది గాక "వివాదభంగార్ణవము" రచించిన జగన్నాథ తర్కపంచాననుఁ డొకఁడు, "అతంద్ర చంద్రికా" నాటకకర్త జగన్నాథ మైథిలి మఱియొకఁడు, "అనంగవిజయ భాణ" కర్త జగన్నాథుఁడు వేఱొకఁడు; మఱియు "అద్వైతామృత" రచయిత జగన్నాథ సరస్వతి, "సాదాయ ప్రకరణ" ప్రణేత జగన్నాథసూరి, "శరభరాజ విలాస" గ్రంథ నిర్మాత జగన్నాథకవి, "జ్ఞాన విలాసకావ్యము" వ్రాసిన నారాయణ దైవజ్ఞపుత్త్రుఁడు జగన్నాథుఁడు, "అనుభోగ కల్పతరువు" వెలయించిన జగన్నాథుఁడు— వీ రెల్లరును జగన్నాథ పండితరాయనికి భిన్నులు.

చని, యా నరేంద్రుని రాజధానిలో నొక పాఠశాలను నెల కొల్పి, యట నివసించుచుండెను. కాలక్రమమున, ఢిల్లీనగరమున వర్ధిల్లు నొక యిస్లామియా పండితునితో నొకతూరి పండిత రాయనికి మతవిషయిక వాద ప్రతివాదము పొసంగెను. పండిత రాయఁడు పంతమూని ఇస్లామియా మతగ్రంథము లన్నియుం జదివి యాకళించుకొని, వాక్యార్థమున నా యిస్లామియా పండితు నోడింప, నటుపై నా కాజీ ఢిల్లీ చక్రవర్తి సమ్ముఖమున నీతని విద్యా బుద్ధి చమత్కారములఁ బ్రశంసింప, నా సార్వభౌముఁడు సంతసించి, యీకవివరుం బిలిపించుకొని యాదరించి, తన యాస్థానియం దొక పూజ్యస్థాన మితని కొసంగెను. ఢిల్లీలోఁ బండితరాయఁ డొక *యవనకామినిం గామించి,

---

* శ్లో॥ యవనీ రమణీ విపద శ్శమనీ
కమనీయతమా నవనీతసమా
ఉహి ఊహి వచోమృతపూర్ణముఖీ
ససుఖీ జగతీహ యదంకగతా. (1)

శ్లో॥ యవనీ నవనీత కోమలాంగీ
శయనీయే యది నీయతే కదాచిత్
అవనీతలమేవ సాధు మన్యే
నవనీ మాఘవనీ వినోదహేతుః. (2)

శ్లో॥ న యాచే గజాళిం నవా వాజి రాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాపి
ఇయం సుస్తనీ మస్తక న్యస్త హస్తా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు. (3)

పాదుషాగారి సమాదరము పురస్సరముగా నామెం బెండ్లి యాడి,యామెతోఁ దన యౌవనము నెల్ల గడపి, వార్ధకదశ యందు వారాణసీపురిం జేర, నితఁడు యవనీ సంసర్గ దూషితుఁ డని అప్పయ దీక్షితాది పండితు లనాదరించిరి. అంత, నీకవి చంద్రుఁడు 'గంగా లహరి' శ్లోకరూపమున గంగాదేవిని స్తుతింపఁగా, నొక్కొక్క శ్లోకమునకు భాగీరథి యొక్కొక్క మెట్టున కుబికి వచ్చి, యీ సిద్ధపురుషుని యవనయువతీ సమేతముగ నాత్మార్పణ మొనర్చుకొని నట్లును, అసూయా మత్సరగ్రస్తు లగు పండితులు పండితరాయని మహిమ కచ్చెరు వందినట్లును జెప్పుదురు.

తా వలచిన యవన యువతి విధివశమున మృతినొంద, పండితరాయఁడు విరహవ్యథాభర్జితుఁడై డిల్లీవదలి కాశిం జేర, నచటి పండితులు దన దురాచారవర్తనముం బురస్కరించికొని దన్నుం దిరస్కరింప, నెచ్చోటను నిర్వృతిఁగాంచక విసివి, స్వవిరచిత గంగా లహరిం బఠించుచు వర్షప్రవృద్ధ యగు భాగీరథిలో మునిఁగిపోయె నని మఱియొక గాథయుం గలదు.

ఈ కవికులవల్లభుఁడు తెలుఁగువాఁ డగుట సకలాంధ్ర విద్వల్లోకమును గర్వింపఁ దగిన విషయము. ఈ మహానీయుని సంపూర్ణసత్యోదంతము సేకరింపఁ బరిశోధకులు పరిశ్రమించి వాణీవరివస్యం గావింతురుగాక!

కృతికర్త.

# పండితరాయఁడు రచించిన గ్రంథములు.

(1) అమృత లహరి (యమునా స్తుతి)

(2) అసఫ్ విలాసము (అసఫ్ నబాబుం గూర్చినది)

(3) కరుణా లహరి (విష్ణు స్తుతి)

(4) చిత్ర మీమాంసా ఖండనము

(5) జగదాభరణము (షాహేజహాను చక్రవర్తి కుమారుఁడు దారాను గూర్చినది)

(6) గంగా లహరి (దీనినే పీయూష లహరి యందురు). ఇందలి శ్లోకములు గొన్ని రసగంగాధరమునం గలవు.

(7) ప్రాణాభరణము (కామరూప దేశాధిపతి వర్ణన మిందున్నది)

(8) భామినీ విలాసము

(9) మనోరమా కుచమర్దనము (భట్టోజీ దీక్షిత విరచిత మనోరమాఖ్య వ్యాఖ్యా ఖండనము)

(10) యమునా వర్ణనము (గద్య గ్రంథము. ఈ గ్రంథములోని ఒకటి రెండు గద్య భాగములు రసగంగాధరమున నున్నవి)

(11) లక్ష్మీ లహరి

(12) సుధా లహరి

(13) రసగంగాధరము.



శ్రీ

# గంగా లహరి.

---

జగముల్ లీలమెయిన్ సృజించిన గిరీ
శస్వామి కైశ్వర్యమై,
తగ భూదేవతకున్ సమృద్ధ విలస
త్సౌభాగ్య సామ్రాజ్యమై,
నిగమశ్రేణికి ముల్లెయై, సురల పు
న్నెంబైన విన్నాణపున్
సొగసై యొప్పెడు నీసుధాసలిల మి
చ్చున్ మాకుఁ గల్యాణముల్. 1

మ॥ తోలఁచుఁ హైన్య దరిద్రదైన్యములు, మొ
త్తుఁ దూష్య దుర్వాసనా
త్తుల కాలుష్యము, నొక్కతూరి కనులం
దుఁ బడ్డమాత్రాన, ని
మ్ముల నజ్ఞాన పటుద్రుమంబు దళనం
బుం జేయుఁ దానెద్ది, నీ
యలఘు శ్రీ సలిలప్రవాహ, మది మో
క్షైశ్వర్యముఁ మా కిడుఁ. 2

మ॥ ఒక పుణ్యంబును జేయనేరని మను
ష్యుల్ సైతముఁ నిన్నుఁ దా
మొకమాత్రైన స్మరింపఁ జీఁకటుల సూ
ర్యుం డేడ్తెఱఁ జీల్చు పో
లికఁ దనాన్మంద్యము రూపుమాపఁగల త
ల్లీ! సర్వ గీర్వాణ నా
యక సేవ్యాకృతి! నా మనోవ్యథలు దే
హావ్యాధులుఁ దీర్పుమీ! 3

మ॥ భవదాలంబ పదంబు నమ్మికొని గ
ర్వం బంది గీర్వాణులన్
లవమేన్ మెచ్చక మోసపుచ్చితి; ననున్
నట్టేటిలో ముంచు న
ట్టవురా నీవ యుపేక్ష చేయునెడ, మా
తా! యింక నెవ్వారితో
నవుగాముల్ మొఱపెట్టుకొందు? కలదే
యాధార మిా జీవికిన్? 4

శా॥ ప్రాంచద్రాజ్యమునేన్ దృణంబుకరణిన్
వర్జించి, లీలామరు
త్సంచార ప్రవిలోల వంజులవనీ
సౌందర్యమాధుర్యముల్
మించం బొల్చెడు నీ దరిన్ గరము బే
ర్మిం జేరి యుష్మత్సుధా
భ్యంచద్వారిని గ్రోలువారి రహి ని
ర్వాణంబుఁ గ్రేణింపదే? 5

మ॥ ఉదయాదిత్య పరిస్ఫుట ప్రకట వ
క్త్రోమాకటాక్షోల్లస
ద్విదితాక్షేపమరీచికల్ దవిలి, క్షో
భిల్లంగఁ జేయంగ, నె
మ్మదిఁ గోల్పోయి, కపర్ది జూటమునఁ గం
పంబొంది తోల్కాడు నో
ప్పిదపుం గాంగతరంగముల్ దురిత దు
ర్భీతుల్ నివారించుతన్. 6

మ॥ శ్రమదీఱన్ దెలవాఱఁ గ్రుంకు నృపయో
షారత్నముల్ స్వీయ వ
క్షములన్ బూసిన యిట్టిగోఱజము యు
ష్మన్నిత్యకల్యాణతో
యములం దెంతటిదాఁక నిల్వఁగల ద
మ్మా! యంతదాఁకన్ విహా
రము సేయంగల వా కురంగములు స్వ
ర్వాటీ వనీ వీథులన్. 7

మ॥ ముదమారన్ స్మరియించుమాత్ర హృదయం
బున్ శాంతముం జేయు న
ట్టిది, సంకీర్తన మాచరింపఁ బటు ధా
టిన్ బాపముం బాపి, బె
ట్టిదపుం బుట్టువురట్టు నాఁపు పరిపా
టిన్ గీర్తి నార్జించిన
ట్టిది నీపే రది నిల్చుఁగాతఁ, దుది క
ట్టె తల్లి! నా నాల్కపై. 8

శా॥ కాకుల్ సైతము నీ దరిన్ దిరుగు వే
డ్కం జేసి, కాంక్షింప వా
నాకాధీశ పురాధివాస మయినన్
భాగీరథీ! పట్టుగాఁ
గైకొన్నట్టి జనాళి జన్మ మృతి దుః
ఖంబుల్ నివారించుచున్
శోకం గూర్చు భవ త్తటంబు శ్రమ దీ
ర్చుంగాక మా కెప్పుడున్. 9

సీ॥ విగత భేదములైన వేదంబులకు నైన
నెందైనఁ దిన్నఁగా నందరాని,
ఎద గణింపంగ వా యెత్తి వాక్రువ్వంగ
నిలఁగల జీవుల కలవిగాని
తన మహిమంబుచేత నవిద్యమాయించు
ననవద్య శక్తిచే నలరుదాని,
ఇంద్రియాతీతమై యాద్యమై యమలమై
యాకారశూన్యమై యమరుదాని
తే॥ నిత్యమగుదాని, సత్యమై నెగడుదాని
ముక్తులెద్దానిఁ బరతత్త్వముగ నెఱింగి
వఱలుదురు దాని నీవని యెఱుఁగుకంటె
లేదు పర మింక సురధునీ! లేదు లేదు. 10

శా॥ దాన ధ్యాన తపోవిధానములచే
తన్ గాని, యజ్ఞంబులన్
గానీ, దేని తలంపుఁ గొంటయు నశ
క్యం బంట సిద్ధంబొ, య
ద్దానిన్ మానితమైన విష్ణుపదమున్
దై వాఱఁగా సర్వ భ
క్తానీకంబుల కిచ్చు విష్ణుపది వ
మ్మా! నీ కొరుల్ సాటియే! 11

మ॥ క్రతుభుగ్వాహిని ! భూజనాళిని సమీ
క్షామాత్ర, సంసార దు
స్థితికిం బాపి, శుభక్రమాకలన వా
సిం గూర్చు నీ మూర్తి య
ద్భుతశక్తిన్ దరమే నుతింపఁ? గినుకన్
దూపిల్లు కాత్యాయనీ
సతి యాటంకము నేన్ గణింపక తలన్
శర్వుండు నిన్నోమఁడే ! 12

మ॥ పతితుల్ వ్రాత్యజనంబులున్ బిశునులున్
వర్జింతు రేకీళ్లు, సి
బ్బితికాండ్రై వచియింప రే యఘములన్
వీడ్కొందు రే పాప సం
గతులన్ మై పులకింప, నట్టి కసటుల్
గావించియున్నట్టి దు
ర్గతులన్ నీవలెఁ దాల్మినేలు కరుణా
ర్ద్రస్వాంత వీవే కదా ! 13

శా॥ ఈ లోకంబు దహించు శోకమును మా
యింపంగ నూహించి నీ
వాలోకంబుననుండి డిగ్గఁ గని, యం
బా! నాఁడు నిన్నంబికా
లోలుం డౌదల బందిసేయుటకు, ని
ర్లోభాత్ములౌ వారి డెం
దాలన్ మోహము గొల్పు నీ సుగుణమే
తప్పయ్యెఁగా! హేతువై. 14

చ॥ కుదుపుల మొద్దులన్ జెవిటి
గొట్టుల గ్రుడ్డుల మూఁగవారలన్
ముదుకల గాలిసోఁకిన మ
నుష్యులఁ బాపము వాయు మార్గ మె
య్యదియు నెఱుంగనట్టి యన
హాయుల దేవవిముక్తులన్ బదిం
బడి నిరయంబునన్ బడెడు
వారలఁ దేర్పఁగ మందు వీవకా! 15

మ॥ సహజ స్వచ్ఛ నిసర్గ శీతలము యు
ష్మ జ్జీవనీయంబు; త
న్మహిమం బీజగమం దపారమయి నిం
డారుఁ గదా నేఁటికిఁ
బహుళానందముతో నొడల్ పులకరిం
పఁ న్నిన్నె కీ ర్తింతు ర
న్వహముఁ దివ్యశరీరులై సగరజుల్
నాకంబునం దుండియుఁ. 16

మ॥ ఒక కొన్నింటిని జిన్నపాపముల నే
వ్రో చేసియున్నట్టి మో
ఖకులఁ దప్తమనస్కులఁ మనుపఁ దీ
ర్థంబుల్ జగంబందు వే
లకు వే లున్నవి గాని, నిష్కృతుల నె
ల్లఁ మించి మెండొడ్డు పా
తకముల్ సల్పిన వారి కెల్లరకు, మా
తా, దిక్కు నీవేకదా ! 17

చ॥ ధన మదిరా విఘూర్ణితులు
ధారుణినాథుల సౌధపాళికిఁ
జనిచని, నూతనవ్యథల
స్వాంతము నెంతొ తపింపఁజేసి నె
ట్టన విహితంబు లెన్నియొ త
టాలున నే చెడఁగొట్టుకొన్న మం
దుని, క్షణమైన ని న్గనని
తుచ్ఛుని నన్ దయఁజూడఁగావలెన్. 18

సీ. తలకట్టు వీవు తీర్థవ్రాతముల కెల్ల
సంధాత్రివి సమస్త సంపదలకు,
వెల్లచీరవు నీవు ముల్లోకములకును,
తావలంబవు సర్వధర్మములకుఁ,
బరిశోధనివి నీవు దురితంపు బుద్ధికి,
నూఁతవు పతిత సంఘాతములకు,
ప్రవినాశనివి నీవు వివిధార్తులకుఁ, గార
ణంబవు నవనవానందములకు;

గీ॥ ఇట్టి శుభలక్షణములకుఁ బుట్టినిల్లు
వై, నిగారిల్లు చల్లనిదానవగుటఁ
దల్లి ! సద్గుణగణ కల్పవల్లి! నాదు
తాపముల మాపుఁగాత నీ యేపు రూపు. 19

మ॥ విలసన్మంద మరుద్విలాస విచల
ద్వీచీహతిన్ దమ్మిపూ
వుల మొత్తమ్ములు రాల్చు పుప్పొడుల బ్రో
వుల్ నిండి సిందూరపుం
గులుకు న్గొల్పఁగ వేల్పుతొయ్యలుల జి
ల్గుంగుబ్బపాలిండ్ల ఘాఁ
తల తోడై యడుసైన నీ జలము మ
జ్జన్మార్తి శోధించుతన్. 20

గీ॥ పొడమినది - కల్మిచెలిసామి యడుగుఁదమ్మి
విడిదిగొన్నది - మరువైరి జడలపట్టు
సలుపునది - దీనపతిత నిస్తారణంబు
జనని ! నీ కేడ నుత్కర్ష జగతి లేదు ? 21

మ॥ నగముల్ వెల్వడి పాఱుచున్న నదులన్
సర్వజ్ఞు జూటంబు నె
క్కఁగ నింకెవ్వరు చాలి ? రేనది రమా
కాంతాంఘ్రి పద్మంబులో
ప్పఁగఁ బ్రక్షాళన మాచరించె ? సుకవుల్
పొల్పంగ నేనాఁటి ని
న్నుగ నూహింతురొ నీకు సాటిగ జగా
నన్ లేశ మాత్రంబయేన్. 22

చ॥ హరుఁడు నటింప నిమ్ము, హరి
హాయిగ శేషుని పైఁ బరుండి ని
ద్దుర గదురంగ నిమ్ము, విధి
దొడ్డ సమాధి వహింప నిమ్ము, మా
తరో ! వలదెట్టి నిష్కృతులు,
దాన తపోయజనాదులున్, వరాల్
గురియు సవిత్రి వీవు ధర
లో విలసిల్లెదు నంతకాలమున్. 23

సీ॥ నే ననాథుఁడఁ జుమీ - నీవు స్నేహార్ద్రవు;
గత గతి నేఁ - బుణ్యగతిద వీవు;
నేఁ బతయాళుండ - నీవు విశోద్ధర్త్రి;
వతిరోగి నేను - నీ వౌషధమవు;
నేను దృష్ణార్తుఁడ - నీ వమృతాబ్ధివి;
పిల్లగాఁ డను నేను - దల్లి వీవు;
నే నపరాధిని - నీవు క్షమాఢ్యవు;
భయవిహ్వలుఁడ నేను - భద్రవీవు;

గీ॥ పలువు లెత్తితిఁ గడకు నీ పాలఁ బడితి
నెటులు కావింతువో యేమొ యింకమీఁద
సముచితం బని తలఁచిన సరణి జరపు
మమ్మ నమ్మితి నిన్ను గంగమ్మ తల్లి ! 24

మ॥ తెలివా! యెప్పటినుండి నీ కథలు ధా
త్రిన్ జేరెనో, వానికిన్
గుఱిగా నప్పటి నుండియున్ యమపురిన్
గోలాహలం బెల్ల రూ
పఱె; దూతల్ గడు దూర మేగిరి పరే
తార్థంబు; స్వర్వీథు లే
యిఱుకై యొత్తడిచేత బి ట్టవిసిపో
యెన్ వ్యోమయానంబులన్. 25

శా॥ కామక్రోధ విజృంభణ జ్వర మహో
గ్ర జ్వాలికా మాలికో
ద్దామాటోప వితప్త దేహులకు మా
తా! మాకు నిత్యమ్ము ని
స్సీమోల్లాస హస న్మరు ల్లులిత రో
చిర్వీచి యుష్మత్కణ
గ్రామ క్రాంతులు తాపశాంతిదము లై
కాంతిల్లు మందాకినీ! 26

మ॥ జననీ। సర్వ జగద్విశాలతల వే
 శ్మంబైన బ్రహ్మాండ మె
ల్లను గల్లోలములందు నిట్టటులు గా
 ల స్కంధలీలన్ జిరం
తనమై దోర్లుచు నుండ శ్రీగళు కప
 ర్దంబందు వాసించు పా
వన యుష్మజ్జలరాశి మా యఘములన్
 భంజించు నో క్కమ్మడిన్. 27

క॥ ఎవని సముద్ధరించు నెడ
 నిమ్మహితీర్థము లెల్ల సిగ్గిలున్
శివుఁడు మొదల్ సురల్ చెవులు
 చెచ్చెరఁ జేతుల మూసికొందు, ర
య్యవిరళ కల్మషున్ నను గ
 తాఘుని జేసితి వేన్ దయావతీ!
వివిధ మహౌఘ నిర్మథన
 వీరుల గర్వము ఖర్వమై చనున్. 28

మ॥ శ్వపచ వ్రాతములున్ వికీర్ణ విచికి
త్సాగ్రస్తులై చూచి, రో
సి, పరిత్యాగ మొనర్చినట్టి కొలలన్
జేసేత లోఁగొన్న పం
కపుఁబెంకిన్ నను, నేలఁగూలిన నరున్
గైనూని పైకెత్తఁ బూ
ను పవిత్రన్ నిను జాహ్నవిన్ నృపశు వెం
దున్ మెచ్చఁగా నేర్చునే! 29

శా॥ అమ్మా! యెవ్వని నుద్ధరింపఁగని, య
త్యాశ్చర్యముం బొందు వి
శ్వ, మ్మాపాటి మనుష్యుఁ డొక్కరుఁడు సం
ప్రాప్తింప లే దింతకా
ల మ్మీరీతిఁ గతించెనన్న చిరకా
లంపుం గొఱంతన్ ద్రుటిన్
వమ్ముం జేయఁగ నీకు నే నిదిగో సం
ప్రాప్తుండనై తిం జుమీ! 30

ఉ॥ తప్పని నీచ సేవనము
దబ్బర లాడుటయున్, గుతర్క, మె
ల్లప్పుడు ముప్పుఁ గూర్చు పిశు
నాశయముల్ గల నన్నుఁ జూచి, నా
యొప్పము లెల్లవేళ విని,
యో జననీ! భువి నీవుగాక యే
యొప్పుల కుప్పయైనఁ గను
నొక్క క్షణం బయినన్ మదాస్యమున్. 31

చ॥ అనుపమ రమ్యమైన భవ
దాకృతిఁ జూచి యెఱుంగవేని, లో
చనము లవెంత విస్ఫుట వి
శాలము లైనను, సుందరంబులై
నను ఫలమేమి? నీ యమలి
న స్వన వార్లహరీ విలాస మే
శన మృదు కాకలీ కల క
లంబు నెఱుంగని వేటి కర్ణముల్? 32

మ॥ క్రమ మొప్పన్ సుకృతుల్ నిజేచ్ఛమెయి, నా
కవ్యోమ యానంబు లె
క్కి మరుత్వంతుని యిక్కకున్ జని, యటన్
క్రీడింతు రంచున్, ఖలుల్
యమరూపంబునఁ గూలఁ ద్రోయఁబడువా
రంచున్ బ్రపంచించు శా
స్త్రము వర్తించును నీవు లేని యశుభ
గ్రామంబునన్ జాహ్నవీ! 33

మ॥ కనకస్తేయము సల్పినట్టి చెడుగుల్
గల్దాఁవు దుర్మార్గ వ
ర్తనులున్ విప్రనికర్తనుల్ గురునిభా
ర్యన్ గూడి మిట్టాడు దు
ర్జనులున్ నీజలమందు మైఁదొఱఁగ స్వ
ర్గానన్ సురల్ సల్పు మ
న్ననలన్ దాతలకన్న దీక్షితుల క
న్నన్ మిన్నగా వెల్గరే! 34

మ॥ సహజాలభ్య సమస్త శస్త సుమన
సౌరభ్య సౌభాగ్య సం
గ్రహ పాండిత్య సమర్థముల్ విరహ శ
స్త్రాక్షోభితప్రాణి వ
ర్గహృతి ప్రౌఢము నైన మారుతము గం
గా మాత! యుష్మల్లస
ల్లహరీ స్పర్శములన్ త్రిలోకముల కు
త్పాదించుఁ బూతత్వమున్. 35

మ॥ కలరమ్మా! యిహలోక కాంక్షలను సా
కల్యంబుగాఁ దీర్చువా
రలు తా మెందఱొ కొంద, ఱింకఁ బరమా
ర్థంబుల్ ప్రసాదించు పు
ణ్యులు నున్నారలు గాని, నీ యెడనె యె
ట్లో యీ జగన్నాథుఁ డ
ర్మిలి లోకద్వయభార ముంచుకొని ని
ద్రించున్ జుమీ హాయిగన్. 36

మ॥ తమిమిరాల్ బతితాధమప్రతతి, ప్రా
త్యశ్రేణిఁ బాషండ కాం
డములన్ గాచుటయందుఁ బ్రేమ మెటు వీ
డన్ లేవొ, యా జాడఁ బా
పమువైఁ బ్రేమ పరిత్యజింప నిపు డం
బా! వీలుగాలేదు నా
కు; మహీమండలి నైజముల్ విడువ లో
కుల్ నేర్తురే యెయ్యెడన్? 37

మ॥ పటు ఘాటీక పురారి సాంధ్యనటన
వ్యాలోల లీలా జటా
ఘటనాభోగ కనత్తరంగ నవ శృం
గారైక హస్తక్రమ
స్ఫుటతా వ్యంజకమున్ బిలాంతచలదం
బుధ్వాన కోలాహలో
ద్భట వాదిత్రము గాంగతాండవము వి
ధ్వంసించు మా పాపముల్. 38

ఉ॥ ఓ జనయిత్రి ! నిల్పుకొని
యుంటిని నీ పయి క్షేమభార, ము
ద్వేజకమైన యీ విషమ
వేళ ననుఁ విడిపించితేని, మా
తా ! జగతీత్రయాన, విత
థ మ్మగు నమ్మక మన్నమాట, ని
ర్వ్యాజకృపావిశేషమున
కాశ్రయమే యిఁక శూన్య మయ్యెడుఁ. 39

మ॥ చెలువారఁ సగమేన నాలుగల జే
జే జూటముఁ జాఱి, కో
మలమౌ పాపట పట్టునఁ బడ, సహిం
పఁ లేక సాపత్న్య సం
చలనోగ్రస్ఫురితాక్షియై గిరిజ రో
షం బూని, యాత్మీయ మం
జుల హస్తమ్మునఁ జిమ్మ నీ యలలు పొ
ల్చుం గాత మ మ్మోముచుఁ. 40

ఉ॥ వేఁడిన వేఁడికోళ్లు నెఱ
వేర్చెడు పూజ్యవు గాన నెందఱో
కూడి ఫలాభిలాషమెయిఁ
గొల్చెద రంతియకాని, తల్లి! నీ
తోడని యొట్టు పెట్టుకొని,
తొంగలిపాట్లొనరించి చెప్పుచు
న్నాఁడను నీ యెడన్ గలదు
నా కనురక్తి నిసర్గజన్యమై. 41

మ॥ మనుజుల్ దాము లలాటపట్టిక ధరిం
పన్ భాస్కరజ్యోతి చా
ద్పున నజ్ఞాన తమస్సు నూడ్చు నెది, వే
ల్పుంబెద్ద యోచించి వ్రా
సిన యా వ్రముక్కడి యక్కరాల నెది తాఁ
జేసేతనే మాయఁ జే
యునో యా నీ వెలలేని మృత్తిక మదీ
యోద్వేగముం బాపుతన్. 42

ఉ॥ అయ్యాయి పల్లెటూళ్లఁ బడి
యచ్చట ద్రుమ్మగు విమూఢచిత్తులౌ
యయ్యల నెవ్వి ఫుల్ల కుసు
మాళి మిషన్ హసియించు, నెవ్వి తా
మొయ్యన స్వీయ సౌరభ స
మున్నతి నిత్య మలీమసాళులన్
నెయ్యమి సుద్దిసేయు నవి
నీ దరిచెట్లగుఁ గాత మా సఖుల్. 43

మ॥ నిరతిన్ దేవతలన్ మహోగ్ర నియతిన్
సేవించుచున్నారు కొం
దఱు; కావించుచు నున్నవా రెలమి జ
న్నంబుల్ విజృంభించి కొం
దఱు; రక్తిన్ నియమంబులన్ యమములన్
బాటించుచున్నారు కొం
దఱు; నీ నామ జపాప్తిఁ ద్రోసితి జగ
జ్జాలంబునే చెత్తఁగాన్. 44

ఉ॥ పుట్టువుఁ దొట్టి యెల్లపుడుఁ
బుణ్యములన్ బచరించువారికిన్
నిట్టుల నైన మేల్ నెఱపు
నేర్పరు లెందఱు లేరు వేల్పు? లె
వ్వట్టునఁ బున్నెమింత సలు
పం గల భాగ్యము లేక, యెట్టి చే
పట్టును లేనివారికి శు
భం బిడువా రెవ రీవుదక్కఁగన్. 45

మ॥ ప్రణుతోల్లోల మతల్లి ! నీ కడఁ బయః
పానంబుఁ గావించి, తో
డన వీఁకన్ విహరించినాఁడను విమా
ధ్రశ్రేణితో శ్రాంతిఁ గొం
టిని, బిడ్డన్ జిరజాగరూకుని నన్
జేపట్టి జోకొట్టు మో
జననీ ! తావక మందవాత శిశిరో
త్సంగంబునన్ జాహ్నవీ ! 46

మ॥ నడికట్టుఁ బిగియించి కట్టుము జగ
న్నాథుఁ గనుఁ వేగిరం
పడి యీ నాఁడు సముద్ధరింప, జననీ
భాగీరథీ! వ్యర్థుఁ డై
వ్వాఁడో సామాన్యుఁ డటంచు హేళన మొన
ర్పం బోకుమీ! బొమ్మ్నకఁ
తొడఁగుం జిల్వలకట్టులఁ బుడుతజా
బిల్లిఁ వడిఁ జుట్టుమీ! 47

మ॥ శరదిందు ద్యుతివై, శశాంక శకల
స్ఫాయ త్కిరీటాఢ్యవై,
కరకుంభాబ్జ వరాభయోల్లసితవై,
క్రమామృతాకార సుం
దర భూషాంబరవై, విశుభ్ర మకరో
ద్యద్వాహనారూఢవై,
పరివర్ధిల్లు నినుఁ భజించినఁ బరీ
భావంబు లే దేరికిఁ. 48

మ॥ మందస్మేర సముల్లసద్వదన స
మ్యక్కాంతిపూరామృతా
నంద శ్రీల భవానల ప్రబల సం
తప్తాంగులన్ దేర్చు మా
యందంపు న్నెలజాణ, శంతనుని యి
ల్లాల్ సాంద్ర చిచ్చంద్రికా
సందోహంబుల మేల్మి కందువ వపు
స్సౌఖ్యంబులన్ మాకిడున్. 49

ఉ॥ మందులు మంత్రముల్ పనికి
మాలిన వయ్యెను - దేవతల్ భయం
బందిరి - మంద మయ్యె సుధ -
వ్యర్థము లయ్యె హరిన్మణుల్ - భరిం
పం దగు ఘోర సంసరణ
పన్నగ దష్టుని నన్ను నో జగ
ద్వందిత కాళియాహిత ప
ద ద్వయ ధావన వీచి! జాహ్నవీ! 50

మ॥ కరిచర్మ ప్రమథాహి నంది విధురే
ఖాముఖ్య సర్వస్వముల్
బురవిద్వేషణుఁ డోడి జూదమునఁ ద
న్నుం బందె మొగ్గంగ, న
త్తఱి, సాకూతముగా గిరీంద్రసుత మం
దస్మేరయై చూడ, దాం
తరలై పొర్లుచు దొర్లు నీ యలల నృ
త్యం బోము మమ్మెప్పుడున్. 51

గీ. ఉచితభూషిత మదన రిపూత్తమాంగ!
హార్ద పద్యాకృతోర్వీ జనార్తిభంగ!
శ్లాఘ్య మోహన తుంగ చలత్తరంగ!
యమలము లొనర్పు మామకాంగములు గంగ! 52



Ananda Press, Madras.